# భారతీయ స్త్రీ ధర్మములు

అనుముల వేంకటసుబ్రహ్మణ్య శర్మగారు

(౨౧ సంచిక తరువాయి)

| కన్య | వడుదు. |
|---|---|
| ౮ ఏండ్ల కన్యకు | ౧౦ ఏండ్లవరుడు. |
| ౯ ... | ... ౧౨½ ,, |
| ౧౦ ... | ... ౧౫ ,, |
| ౧౧ ... | ... ౧౭½ ,, |
| ౧౨ ... | ... ౨౦ } ,, |
| ౧౩ ... | ... ౨౨½ } ,, |
| ౧౪కు ... | ... ౨౫ ,, |
| ౧౫కు ... | ... ౨౭1/2 ,, |
| ౧౬కు ... | ... 30 ,, |

వీనిలో ఏండ్లు ౧౨ కన్యకయినప్పుడు ౨౦ ఏండ్లవానికిచ్చుటయు, ౧౩ ఏండ్లయినపుడు ౨౨½ ఏండ్లవానికిచ్చుటయు, ౧౪ ఏండ్లయినపుడు ౨౫ ఏండ్ల వానికిచ్చుటయు భారతకారుని మతమై యున్నది.

౧౪ ఏండ్లకంటెను నధిక వయస్సు వచ్చువఱకును బాలికా వివాహము నిరీక్షింపబడుట న్యాయము కాజాలదు. అందు ప్రమాదముగూడ నున్నది. కనుక ౧౨ ఏండ్లు నిండినది మొదలుకొని ౧౪ ఏండ్లు నిండులోపల బాలికకు వివాహము చేసియే తీరవలయునను నియమముండవలయును. పురుషునకు నయితము ౨౦ మొదలు ౨౫ ఏండ్లలోపల వివాహముచేయుట త్యావశ్యకమే. ఇట్టి యెడ వారి విద్యాకాలమెంతయని యిప్పుడు విచారింతము.

బ్రాహ్మణశిశువు గర్భాష్టమమున నుపనీతుడై విద్యాభ్యాసమునకు దొరకొనినచో ననగా ౭వ ఏట విద్య నారంభించినచో ౨౦ ఏండ్లు నిండునరికి నతని విద్యాకాలము ౧౪ ఏండ్లగును. ౨౫ ఏండ్లవాడగు వఱకును జదువునేని ౧౭ సంవత్సరములగును. మనువు నయితము అత్యల్పముగు నత్యధికముగు గాని విద్యాకాల పరిమితి ౧౭ ఏండ్లని చెప్పియున్నాడు. కనుక నిది యంగీకార్యమే.

ఆ గర్భాష్టముననే బాలికయు జదువ నారంభించెనా ౫ లేక ౭ సంవత్సరములు విద్యాభ్యాసముచేసి పిదప ౧౨ ఏండ్లు నిండి కాని లేక ౧౪ ఏండ్లు నిండినదై కాని వివాహమాడుటకే యభ్యంతరములు లేవు కాని స్త్రీవిద్య పురుషవిద్యవలెనే యుండినచో నది ప్రయోజనకారి గాజాలదు.

## స్త్రీపురుష విద్యాభేదములు

నమస్కార్యత్వ సందర్భమున మనువు

శ్లో॥ లౌకికం వైదికం వాపి తథాధ్యాత్మికమేవచ
ఆదదీత యతో జ్ఞానం తంపూర్వమభివాదయేత్.

అని చెప్పియున్నాడు. దీని కుల్లూక భట్టీయ వ్యాఖ్యానమిట్లున్నది. లౌకిక జ్ఞానమనగా నర్థశాస్త్రాది [వ్యవహార] జ్ఞానము. వైదిక జ్ఞానమనగా వేదార్థ జ్ఞానము. ఆధ్యాత్మిక జ్ఞానమనగా బ్రహ్మజ్ఞానము. ఈ త్రివిధ జ్ఞానములలో నొకదానినైనను దానెవని వలన గ్రహించి యుండునో యతడు పూజ్యులు పెక్కుండ్రున్న స్థలమున గూరుచుండి యున్నచో మొదట నతనికి నమస్కరించి పిమ్మట గ్రమానుసారముగా నితరులకు నమస్కరించునది. పైన జెప్పబడిన మూడు జ్ఞానములును మువ్వురియొద్ద గ్రహించి యుండ వారందఱు నొకచో నున్న యెడల వారిలో నాధ్యాత్మిక జ్ఞానదాతకు మొట్టమొదటను దర్వాత వైదిక జ్ఞానదాతకును నతని పిమ్మట లౌకిక జ్ఞానదాతకును క్రమముగా నమస్కరించునది.

రాజయోగ్య విద్యాగ్రహణమును గూర్చి చెప్పినప్పుడు మఱియొకచోట

"త్రైవిద్యేభ్యస్త్రయీవిద్యాం దండనీతించ శాశ్వతీం
ఆన్వీక్షికీంచాత్మవిద్యాం వార్తారంభాంశ్చ లోకతః.

త్రైవిద్యులనగా షడంగ యుక్తమైన వేదత్రయమునధ్యయనముచేసి కృతార్థులైన వైదికులు. వారివలన ధర్మకర్మానుష్ఠాన యోగ్యతా సంపాదనము కొఱకు త్రయీవిద్యను గ్రహింపవలెను. త్రయీవిద్యకే వైదిక జ్ఞానమని పేరు. ప్రజలను వారివారి ధర్మార్థ కామములనబడు త్రివర్గమునందు మర్యాదాతిక్రమణము చేయకుండు లాగున శాసించు నిమిత్తము దండనీతిని [శిక్షాస్మృతిని] తదభిజ్ఞులవలన గ్రహించునది. దండ నీతికర్మ శాస్త్రమనియు నామాంతరము. తనబుద్ధిని సత్య నిశ్చయమునకు యోగ్యముగు నట్లు చేసికొను నిమిత్తము అన్వీక్షికిని [తర్క శాస్త్రములను] తద్విచక్షణుల వలన నేర్చుకొనునది. జితేంద్రియత్వాదులతో నుసాధనమగు మోక్ష సంపాదనము నిమిత్తము ఆత్మవిద్యను అనగా నాధ్యాత్మిక జ్ఞానమును ఉపనిషద్ధర్మజ్ఞాన నిష్ణాతులగునట్టి వారివలన గ్రహించునది. ధనార్జనము నిమిత్తము వార్తను అనగా కృషిగోరక్షా వాణిజ్యాది వృత్తివిద్యను తత్తద్వృత్తి నిపుణులవలన దెలిసికొనునదియని భావము.

ఇందలి అన్వీక్షికీ దండ నీతివార్తలను మూడు విద్యలకును లౌకిక విద్యలనియే పేరు. తక్కిన రెంటిలో త్రయీవిద్యకే వైదిక విద్యయని నామాంతరము. ఇక మూడవది యాధ్యాత్మికవిద్య. ఇదియే సర్వోత్కృష్ట విద్యయని పూర్వశ్లోకార్థమున వ్రాయబడి యుండెను.

పురుషునకే విద్యలన్నిటి యందును బ్రయోజనము లున్నవి. వానికి వివాహ యోగ్యమగు కాలముగూడ స్త్రీలకంటె రమారమి యెనిమిదేండ్లు మిక్కుటముగానున్నది. కాని స్త్రీలకీ విద్యలన్నియు నవసరమా? అవసరమైనను వారు విద్యాభ్యాసమునకు సాధారణముగా ౧౭ ఏండ్ల కాలము గడపవగి యున్నారా? అనువిషయము విచారణీయములు. కాని యిప్పటి విద్యా విధానమునుబట్టి నయితము స్త్రీవిద్య పురుషవిద్యకు తుల్యముగా నుండగూడదు.

నేటి యాంగ్లేయ విద్యా పర్యాప్తకాములు నయితము ప్రభుత్వోద్యోగ రూపమగు దాస్యవృత్తికంటె నధికలాభమును బొందియుండలేదు. ఈ దాస్యముననే తమ స్త్రీలను నయితము లాగికొనపోవుట భారతీయ ధర్మములకును జాతీయతకును నయితము విరుద్ధమైన యొక స్వాచ్ఛంద్యమే యగును. కనుక భారతీయ స్త్రీలవిద్యావిధాన మిందులకు భిన్నముగనే యుండవలయును.

(సశేషము)

## స్థానిక వృత్తాంతములు

### ఆబ్కారి శాఖ

అబ్కారి నాజం సా॥ నారభి ప్రాయాను సారము రంగారెడ్డి తాలుక్దారు గారిని ౧౫ అమరుదాదు నుండి ౧౩౩౯ ఫ సంవత్సరము పూర్తి యగువరకు బకాయా తహ్సీలాకొరకు స్పెషల్ తాలుక్దారుగా నియమింపబడిరి.

### అకాల మరణము

౧౩ వ షహరేవరువాడు ౧-౩ గంటలకు ఘాన్సి మియా బజారునందు ౪ సంవత్సరముల బాలిక పాత గోడ పైబడినందున మరణించెను.

### తాడుబన్ మేలా

తాడుబన్ మేలాను దర్శించుటకు ప్రభువుగారు పతీసుతుల యుక్తముగ వెడలిరి. ఆరోజు ప్రభుత్వ కార్యాలయములకు అర్ధదినము సెలవొసంగ బడెను

### దొంగతనము

అఫ్జలుగంజ్ వంపుగల బాలికొట్టిన రూపాయల కాణముకుండేదు॥ ౩-౫౩ విలువగల ముల్యము లుదొంగలింప బడినవి పోలీసువారు పరిశోధించు చున్నారు

### మోటారు వేగముగ నడపుట

మోటారు డ్రైవరగు షేకుఅహ్మద్ అతివేగముగ బండిని తోలి చారిమినారు రెలింగుకు తాకించి నందున జుర్మాన విధించబడెను

### విషము త్రాగుట

కార్వాను నివాసియగు శంకరుబాయి అను నామె తీవ్రమైన విషము పుచ్చుకొని కడుపు శూలచె బాధ నొందుచుండెను అఫ్జలుగంజ్ ఆసుపత్రిలో ప్రవేశ పెట్టబడెను. కాని రెండు గంటల లోపలనె కడుపు పగిలి మరణించెను.

### ప్రభువుగారి విరాళము

ఢిల్లీ లేడీ హార్డింగు కళా శాలకు శ్రీ నిజాం ప్రభువుగారు సంవత్సరమునకు రెండువేల రూపాయి లంగీక రించిరి.

### భాషాంతరీ కరణ శాఖాధిపతి

ఈ విషయమై నిశ్చయము జరుగు వఱకు మౌల్వీ మహమ్మదు యినాయితుల్లా సా॥ పనిచేయునట్లు ఆజ్ఞాపింప బడినది.

### ఇస్లామియా హైస్కూలు

ఈ పాఠశాల కివ్వ గ్రాంటు మరి రెండు సంవత్సరముల కొఱకు ౧౮౦౦ చొప్పున అంగీక రింప బడినది

### బహుమాన ప్రదాన సభ

సెంటు జార్జి గ్రామరు స్కూలుయొక్క ఒ బహుమాన ప్రదాన సభయును నూతన వన ప్రవేశోత్సవమును నేడు అయిదు గంటలకు గౌ॥ రెసిడెంటు గారి భార్య యాజమాన్యమున జరుగును.

### ఉస్మానియా కళాశాలాధ్యక్షులు

మహమ్మదు అబ్దుర్రహమాన్ ఖాన్ సా॥ బి ఎస్. సి నేడు సాయంత్రము మెయిలులో వచ్చెదరని తెలియుచున్నది. వీరు లండన్ నగరమున ఆచటి కాలేజి శతాబ్దోత్సవమునందు పాల్గొనుటకై పోయి యుండిరి.

### ఉస్మానియా ఎల్. ఎల్ బి పరీక్షా ఫలితములు

#### ఫైనల్

#### మొదటి తరగతి

ఎస్.జి. యావుద్రహిమాన్ రజ్వి, మహమ్మదు అబ్దుల్ రవూఫు, వెంకట ప్రసాదు, ఇంద్ర కిరణ్, మహమ్మదు అబ్దులు ఖాదర్ సర్వారి, భీకాజి. మాణిక్యరావు మారు నాలకుల్, ప్రభాకర్ దామోదరు సండేలకర్, రజా మహమ్మదు ఖాన్, సయ్యదు యూనసు, ఆర్ రాజా ప్రసాదు, లాలు బర్కత్, మహమ్మదు కమాలొద్దీన్ పి. ఎన్. శర్మ క్రిష్ణా బారతోష్కి, సయ్యదు అబ్దుల్ జబ్బారు,

మొదటి సంవత్సర తరగతి ఫలితములు రాబోవు సంచికలో ప్రకటింపబడును.

### వైద్యకళాశాల ఫలితములు

ఇవి రాబోవు సంచికలో ప్రకటింపబడును.

### స్మారకసభ

ఈసభ బాల సరస్వతీ ఆంధ్ర భాషానిలయము న శ్రీయుత తాడేపల్లి మృత్యుం జయరావు బి ఎ. ఎల్. ఎల్. బి గారి యధ్యక్షతక్రింద సమావేశమయ్యెను. సుమారు ఏబదిమంది సభకు విచ్చేసిరి కీ॥ శే॥ పువ్వాడ వేంకటప్పయ్యగారి యకాల మరణమును గూర్చి విషాదమును వెలిబుచ్చుచు, వారిగుణగణముల గూర్చి శ్రీయుతులు మాడపాటి హనుమంతరావు, వద్దిరాజు నరసింహా రావుగార్లు ఒక గంటకాలము గంభీరోపన్యాసము గావించిరి.

### తీర్మానము

విఖ్యాతాంధ్ర భాషాసేవకులును, నిజాం రాష్ట్రాంధ్ర దేశమున గ్రంథాలయోద్యమ వ్యాప్తికై అవిశ్రాంతముగ పాటుబడిన దేశాభిమానులగు పువ్వాడ వేంకటప్పయ్యగారి యకాల మరణమును గూర్చి హైదరాబాదులోని ఆంధ్రులు తమ విచారమును ప్రకటించుచు కీర్తిశేషుని ఆత్మకు శాంతి ప్రసాదింప భగవంతుని ప్రార్థించు చున్నారు



## కంటి ఆరోగ్యము.

ఎప్పుడును, కొంచెముకైనను, మిక్కిలి కాంతి గల వస్తువులవైపు చూడరాదు

వెలుగు బాగుగాను ఉండవలయును అది మిక్కిలి ప్రకాశముగా గాని చాల తక్కువ కాంతిగా గాని యుండరాదు. అట్టి వెలుగు మన వెనుక నుండి ఎడమ చేతివైపుగా పుస్తకము మీద పడవలయును. కాని కంటి మీద ఎంత మాత్రము పడరాదు. కిటికీవైపు మనము వీపుపెట్టికొని కూర్చుండిన యిట్టి వెలుగు రాగలదు సరిగాముద్రపడనట్టివిన్ని, చిన్న అచ్చులో ముద్రించినట్టివిన్ని పుస్తకములు, కాగితములు చదువరాదు. అచ్చు అక్షరములు 3/50 అం॥ ఎత్తునకు, 1/100 అం॥ వెడల్పునకు తక్కువగా నుండరాదు.

సంధ్య వెల్తురులో గాని సూర్యకాంతిలో గాని చదువకుము మెరుగైనమిక్కిలి తెల్లకాంతిగల కాగితములు వాడకుము. అవి కండ్లను చెదరజేసి బాధకలిగించును. కండ్లను తరచుగా విశ్రాంతి నిచ్చుచుండవల యును. ఏలే సూర్యునపుడెల్ల మరొక దిక్కుగాచూచిన విశ్రాంతి కలుగును పిల్లల ఆరోగ్యస్థితి ననుసరించి ఆరు లేక ఏడు సంవత్సరములకు లోపుగా చదువారంభింపరాదు. రైలులో గాని, బండిలో గాని ప్రయాణముచే యుసపడుచున్నా, పరుండిన్ని చదువరాదు.

చదువునప్పుడు, వ్రాయునపుడు తల, వళ్లు నిలువుగా నుంచవలయును వంచరాదు కూర్చుండుటకు సౌఖ్యముగానుండునటుల కుర్చీలు మేజాలు తయారు చేయవలయును పిల్లలు పుస్తకముల మీదికి వంగవలసిన అవసరముండరాదు. పుస్తకముల మీద పడు చూచదువుటకూడదని తెలియజేయవలయును. కంటికి 12—18 అం॥ దూరములో పుస్తకముండునట్లుగా బల్లలు తయారు చేయవలయును మేజాబల్ల ౩౦ డిగ్రీలు ఏటవాలుగా నున్న పుస్తకముమీద పడుచూచదువ నవసరముండదు. బడిపిల్లలలో నూను, తలవంచుట, కూర్చుండుటలో లోపముచే గల్గును. వెంటనే పిల్లవాడు గాని ఉపాధ్యాయుడు గాని తగు శ్రద్ధవహింప మిచే యివి బాగా ఏర్పడును.

ప్రకృతిమనకు యీ దిగువ చిహ్నములచే రాబోవు కీడును తెలియజేయగనే తగు శ్రద్ధ తీసికొనుట ఉచితమైన పని. చిహ్నములు కండ్లవెలుగురుకోరుట, మండుట, వెలుగుసహింపజాలకుండుట, దురద, ఎరుపు, కంటిమీద పురుపులు, కనురెప్పలు వాచుట, ఒక కంటికన్నమరొక కన్ను చిన్నదిగా నుండుట, నల్లని వలయము లేర్పడుట, కంటి చుట్టూ ముడుతలు, నత్తి, వణకు, కండ్లార్చుట, తలదిమ్ము, తలనొప్పి, చదువునందయిష్టము, నిద్రమత్తు, మూర్ఛ, శ్రద్ధగానే పని చేయలేక పోవుట, త్వరగా కోపగించు కొనుట, మరపు, విచారము అలపు, కండ్లకు 14 అం॥ కు మించిన దూరములో గాని సమీపమున గాని పుస్తకముంచి చదువుట, చిన్నఅచ్చురాతప్రలందు చదువునపుడు అసౌఖ్యము, నల్లని చుక్కలుపడుట, మబ్బుకమ్మినటులుండుట, కండ్లముందు దారములు వ్రేలాడు చున్నట్లుండుట.

సలహానిచ్చు నేత్రవైద్యుడు, డాక్టరు కె వి పోపటు, యల్. ఆర్. సి పి.యస్. యల్.యం. (యెడింబరో) పాశ్చాత్య అంధు కంపెనీ, నేత్రవైద్యులు, సులోచనము లమ్మువారు. (లండను) జేమ్సుబజారు, సికింద్రాబాదు.

## ప్రభుత్వావసరములు పూర్తిజేయును.

ప్రపంచమందన్ని సంస్థలును డాజి బ్రదర్సు కమర్షియల్ బండ్లను ప్రయోగించును. జమైకాలోని కింగ్స్టనునందును, బొంబాయినందును, దక్షిణాఫ్రికాలోని కేపుటౌనునందును, తపాల శాఖ వారును ఆస్ట్రేలియా నందలి ఇతర ప్రభుత్వ శాఖలును, ఈ బండ్లను వాడెదరని చెప్పిన తక్కువదే.

బలమైన ఫ్రేములును, స్ప్రింగులును, బలమైన ఇతర భాగములును నుండుటచే చాల ప్రయోజనకారియని వీలుకే తేటపడును. అందులను ఇతర రకముల బండ్లకన్న డాజి బ్రదర్సు కమర్షియల్ బండ్లు చాల మేలైనవియును, తక్కువ వ్యయమునకే వినియు, ఏల చెప్పెదరు.

ఇతర వివరములు కోరువారును, ధరలు తెలుసుకొనువారును, దిగువ విలాసమునకు వ్రాయవలయును.



# Meets Government Specifications

Hundreds of public institutions throughout the world employ Dodge Brothers Commercial Cars. The Post Offices at Kingston, Jamaica; at Bombay, India; at Capetown, South Africa; and several government departments in Australia—to mention only a few.

Deep, heavy channel frames, reinforced all-vanadium springs, ample body dimensions, the prodigal use of fine alloy steels and drop forgings—all tell a story of exceptional efficiency. All tell why Dodge Brothers Commercial Cars render better and more economical service than most light trucks of much larger *rated* capacity.

Dodge Brothers Screen Commercial Car - - - -
Dodge Brothers Touring Car - - - - -
Graham Brothers 1-Ton Chassis - - - - - - -
Graham Brothers 1½-Ton Chassis - - - - - - -
*Delivered*

బొంబాయి సైకలు ఏజెన్సీ

అందు మోటారు లిమిటెడ్.

౫-౨, ౫౩, జేమ్సుస్ట్రీటు,
సికింద్రాబాదు (దక్కన్)

టెలిగ్రాం:—మోటర్ స్టన్సు. టెలిఫోను నం. ౨౧౩.

# DODGE. BROTHERS COMMERCIAL CARS

REG. No. N. 45. REG. No. M. 2186

గోలకొండ పత్రిక
ట్రూపుబజారు హైదరాబాదు, దక్కన్.
సంవత్సరము చందా రు. ౦
అర్ధ సంవత్సరము ,, ,, ౧-౫-౦
విడి ప్రతి ౦-౧-౪

STAMP.

Printed and Published by B. Prtahana Reddy at the Golkonda Press, Troop Bazaar, Hyderabad, Dn.